# "శ్రీకాళహస్తీశ్వరా ... !"

పూర్వం వసిష్ఠుడు ఒకప్పుడు కాళహస్తిక్షేత్రానికి వచ్చి అక్కడ ఒక నది లేకపోవడంతో విచారించి, నది కోసం శివునికై తపస్సు చేయగా, శివుడు బ్రహ్మను తోడుగా ఇచ్చి, మందాకినీనదిని పంపిస్తాడు. ఆ నది బంగారు కాంతితో, ఎక్కువ హోరు చేస్తూ వచ్చినందువల్ల 'సువర్ణముఖరీ' నదిగా ప్రసిద్ధి చెందింది.

* * *

ఈ నదికి రెండువైపులా మొగలి చెట్లు ఉన్నాయి ... కాబట్టి దీనిని 'మొగిలేరు' అని కూడా అంటారు. మొగలి పూలు బంగారు రంగులో ఉంటాయి కాబట్టి, అవి సువర్ణముఖ పుష్పాలు. వీటి మధ్య ప్రవహిస్తున్నందువల్ల ఇది 'సువర్ణముఖి' నది అయింది.

## " శతక కవి ... ధూర్జటి "

" శ్రీకాళహస్తీశ్వర శతక " కవి ధూర్జటి... ఆయన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలలో ఒకడు. సింగమ రమానారాయణుని (జక్కయ నారాయణ) కుమారుడు. ధూర్జటి భగవత్సాక్షాత్కారాన్నీ, భగవదనుభూతినీ పొందిన మహాకవి. శ్రీకాళహస్తీశ్వర శతకంలో ధూర్జటి తన మనస్సులోని భావాలనూ... తను అనుసరిస్తున్న ఉపాసనా మార్గాన్నీ... సూటిగా, స్పష్టంగా, వాడుక భాషలో చెప్పాడు.

## " ఓంకార ... ప్రణవ స్వరూపుడు "

" ఆరావం బుదయించెఁ దారకముగా నాత్మాభ్రవీథిన్మహాఁ
కారోకారమకారయుక్తమగు నోంకారాభిధానంబు చె
న్నారున్ విశ్వ మనంగఁ దన్మహిమచే నానాదబిందుల్ సుఖ
శ్రీ రంజిల్లఁ గడంగు నీవదె సుమీ శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా ! 'ఆత్మ' కు ... 'చైతన్యం' కు ... ఆధారస్థానమైన 'దహరాకాశం'లో ఒక సూక్ష్మమైన ధ్వని ఉత్పన్నమైంది. అదే 'అకార', 'ఉకార', 'మకారా'ల కలయికతో ఏర్పడిన 'ఓంకారం' అనే నాదం. ఈ నాద మహిమవల్లనే ఈ విశ్వం ... భౌతికప్రపంచం ... అదే బిందువు ... ఉత్పన్నమైంది. ఈ నాదం కాని ... బిందువు కాని ... చక్కని శోభతో ప్రకాశించడానికి మూలమైన ఆ ప్రణవం ... ఆ ఓంకారం నీవే కదా స్వామీ ! "

**" అన్యథా శరణం నాస్తి "**

**" నిన్ను నమ్మినరీతి నమ్మ నొరులన్ నీకన్న నాకెన్నలే
రన్నల్దమ్ములు తల్లిదండ్రులు గురుండాపత్సహాయుండు నా
యన్నా! యెన్నఁడు నన్ను సంసృతివిషాదాంభోధి దాటించి య
చ్ఛిన్నానందసుఖాబ్ధిఁ దేల్చెదొ కదే శ్రీకాళహస్తీశ్వరా ! "**

" శ్రీకాళహస్తీశ్వరా ! నేను నిన్ను నమ్మినట్టు ఇంకెవ్వరినీ నమ్మను. నాకు అన్నదమ్ములు ... తల్లిదండ్రులు ... గురువు ... ఆపదల్లో సహాయపడే వాళ్ళూ ... నీ కంటే వేరే ఎవ్వరూ లేరు. నా తండ్రీ ! నిన్నే ఆశ్రయించి ఉన్న నన్ను ఈ సంసార దుఃఖ మహాసముద్రాన్ని దాటించి ... అఖండ ఆనందామృత సముద్రంలో తేలేటట్లు ఎప్పటికి అనుగ్రహిస్తావో కదా స్వామీ ! "

**" అవిద్య ... కామం ... కర్మల చక్రం "**

**" విత్తజ్ఞానము పాదు చిత్తము భవావేశంబు రక్షాంబువుల్
మత్తత్వంబు తదంకురం బనృతముల్ మాఱాకు లత్యంతదు
ర్వృత్తుల్ పువ్వులుఁ బండ్లు మన్మథముఖావిర్భూతదోషంబులుం
జిత్తాధ్యున్నతనింబభూజమునకున్ శ్రీకాళహస్తీశ్వరా ! "**

“ శ్రీకాళహస్తీశ్వరా! సంసార వాసనలవల్ల కలిగే వ్యథ అన్నది చాలా ఎత్తైన వేపచెట్టు వంటిది. అజ్ఞానమే దానికి మూలమైన విత్తనం ... మనస్సు దానికి చేసిన పాదు ... సంసారవిషయ ఆవేశం దాని చుట్టూ వేసిన గట్టు మరియు గింజ మొలకెత్తడానికి నీరు ... అహంకారం దాని మొలక ... అసత్యాలు అనేవి ఆకులు ... చెడు నడవడికలే దాని పువ్వులు ... కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాలు ఆ చెట్టుకు కాసిన పండ్లవంటివి. ఇవన్నీ జీవులు సంసారచక్రంలో బద్ధులవడానికి మూలహేతువులు. ”

## “ అజ్ఞాన సముద్రం ”

**“ అంతా మిథ్య తలంచి చూచిన నరుండట్లౌ టెఱింగిన్ సదా**
**కాంత ల్పుత్రులు నర్థమున్ తనువు నిక్కం బంచు మోహార్ణవ**
**భ్రాంతిం జెంది జరించుఁ గాని పరమార్థంబైన నీయందుఁ దాఁ**
**జింతాకంతయుఁ జింత నిల్పఁడుగదా శ్రీకాళహస్తీశ్వరా ! ”**

“ శ్రీకాళహస్తీశ్వరా ! ఆలోచించి చూస్తే ఈ ప్రపంచంలో ప్రతి ఒక్కటీ అవాస్తవమూ, అశాశ్వతమే! ఈ సత్యం తెలిసి కూడా ప్రతి ఒక్కరూ తన భార్య, బిడ్డలు, శరీరం, ధనం ... ఇవన్నీ శాశ్వతాలనుకుని ... వాటి వల్ల సుఖం కోసం ప్రయత్నిస్తూ ... అవివేకం అనే సముద్రంలో పడి, ఒడ్డును చేరలేక, దానిలోపల లోపలే తిరుగుతూ ఉన్నారు. కానీ, ఆలోచించి చూస్తే ‘పరమసత్యవస్తువు నువ్వు మాత్రమే’ అని తప్పక తెలుస్తుంది. అటువంటి నిన్ను ‘చింతాకంత’ అయినా ధ్యానించకపోవడం... తెలిసి తెలిసి ఈ సంసారభ్రాంతిలో గడపడం ... చాలా శోచనీయమైన విషయం కదా ! ”

## " మోహబంధ పరంపర "

" ఆలంచు న్మెడఁ గట్టి దానికి నపత్యశ్రేణిఁ గల్పించి త
ద్బాలవ్రాతము నిచ్చిపుచ్చుటను సంబంధంబు గావించి యా
మాలర్కంబున బాంధవం బనెడి ప్రేమం గొందఱం ద్రిప్పఁగాఁ
సీలన్సీల యమర్చిన ట్లొసఁగితో శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా ! ఒక సీలను బిగించడానికి దాని మీద మరిన్ని సీలలను కొట్టినట్లు ... ఈ వ్యవస్థలో ... భార్య అనే ఒక బంధం ఏర్పరచి ... ఆ పై సంతానాన్ని కలిగించి ... ఆ పిల్లలను ఇచ్చి-పుచ్చుకోవడం అనే చుట్టరికాలు, సంబంధాలు ఏర్పరచి ... మానవులను ఈ ప్రాపంచిక బంధపరంపరలో తిప్పుతున్నావే! ఈ బంధాలనుండి నన్ను వదిలించు స్వామీ ! "

## " మోహబంధ విముక్తి "

" ఆలుంబిడ్డలు దల్లిదండ్రులు ధనంబంచు న్మహాబంధనం
బేలా నామెడ గట్టినాడ విక నిన్నేవేళఁ జింతింతు ని
ర్మూలంబైన మనంబులో నెగడు దుర్మోహాబ్ధిలోఁ గ్రుంకియీ
శీలామాలపు జింత నెట్లుడిపెదో శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా ! భార్య, బిడ్డలు, తల్లి, తండ్రి, ధనం... వంటి ఈ మహాబంధాలను నాకు ఎందుకు కల్పించావు స్వామీ!? వాటికి సంబంధించిన కోరికలు అనే మోహసముద్రంలో మునిగి ఉన్న నా మనస్సుకు నిన్ను ధ్యానించే సమయం ఎక్కడిది ? ఇటువంటి అజ్ఞానపు ఆలోచనలనుండి ... నన్ను ఏ విధంగా వదిలించి ... నాకు ముక్తి అనుగ్రహిస్తావో ... నీదే భారం స్వామీ ! "

## " అంతః శత్రువులు "

**" నీనాసందొడఁబాటుమాట వినుమా నీచేత జీతంబు నేఁ**
**గానిం బట్టక సంతతంబు మది వేడ్కం గొల్తు నంతస్సప**
**త్నానీకంబున కొప్పగింపకుము నన్నాపాటియే చాలుఁ దే**
**జీ నొల్లం గరి నొల్ల నొల్ల సిరులన్ శ్రీకాళహస్తీశ్వరా ! "**

" శ్రీకాళహస్తీశ్వరా ! నేను నిన్ను ఎంతో భక్తితో అన్నివేళలా సేవిస్తాను. అందుకు ప్రతిఫలంగా నాకు ఒక్కపైసా జీతం గానీ ... గుఱ్ఱాలు, ఏనుగులు వంటి ఏ సంపదలు గానీ ... అక్కరలేదు. కానీ, నా మనస్సులోనే ఉండి, నన్ను ఎల్లప్పుడూ బాధించే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాలు అనే అంతః శత్రువులకు నన్ను అప్పగించకుంటే అంతే చాలు ... నాకు ఎంతో జీతం ఇచ్చినట్టే. "

## " జన్మ రాహిత్యం "

**" మును నేఁ బుట్టిన పుట్టు లెన్ని గలవో మోహంబుచే నందుఁ**
**జేసిన కర్మంబుల ప్రోవు లెన్ని గలవో చింతించినన్ గాన నీ**
**జననంబే యని యున్న వాడ నిదియేచాలింపవే నిన్నుఁ గొ**
**ల్చిన పుణ్యంబునకుం గృపారతుఁడవై శ్రీకాళహస్తీశ్వరా ! "**

" శ్రీకాళహస్తీశ్వరా! ఇంతకు ముందు జన్మలలో అజ్ఞానం చేత నేను చేసిన కర్మలు ఎన్ని ఉన్నాయో తెలుసుకునే శక్తి నాకు లేదు. అందుకని నేను ఈ జన్మను గురించి మాత్రమే ఆలోచిస్తున్నాను. ఇంతవరకు నిన్ను సేవించిన పుణ్యం వల్ల నువ్వు నా మీద దయతో ఈ జన్మలోనే నాకు ముక్తి కలిగేటట్లు అనుగ్రహించు స్వామీ ! "

## " రెండు కోరికలు "

" తను వెందాక ధరిత్రి నుండు నను నందాకన్ మహారోగదీ
పనదుఃఖాదులఁ బొందకుండ ననుకంపాదృష్టి నీక్షించి యా
వెనుకన్ నీపదపద్మముల్ దలఁచుచున్ విశ్వప్రపంచంబుఁ
బాసిన చిత్తంబున నుండఁజేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా ! నా శరీరం ఈ భూమి మీద ఉన్నంత వరకు మహారోగాల వల్ల కలిగే దుఃఖం లేకుండా నన్ను దయాదృష్టితో చూడు. అటు తర్వాత నేను నీ పాదపద్మాలనే సేవిస్తూ ఈ సర్వ ప్రపంచపు వాసనలను వదలగలిగేటట్టు నన్ను అనుగ్రహించు స్వామీ ! "

## " ఉపాసన "

" అకలంకస్థితి నిల్పి నాద మను ఘంటాఁ రావమున్ బిందుదీ
పకళాశ్రేణి వివేకసాధములొప్పన్ బూని యానందతా
రకదుర్గాటవిలో మనోమృగముగర్వస్ఫూర్తి వారించువా
రికిఁగా వీడు భవోగ్రబంధలతికల్ శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా! మనస్సును స్వాధీన పరచుకుని, సంసారబంధాలు అనే భయంకరమైన కట్లను తెంచుకొని, సంసారం అనే అరణ్యం నుండి బైటపడడానికి... ఉపాసకులకు 'ప్రణవనాదం' అనే ఘంటధ్వనీ, 'బిందువు' అనే దీపకాంతులూ, వివేకవైరాగ్యాది చతుర్విధ సాధనాలూ ఉపయోగపడతాయి. కానీ, సాధన చేయని వాళ్ళు ఈ బంధాలనుండి ఎలా బైట పడగలరు ? "

## " శివధ్యానం పరమానందప్రదం "

" దినముం జిత్తములో సువర్ణముఖరీ తీరప్రదేశామ్రకా
ననమధ్యోపలవేదికాగ్రమున నానందంబునం బంకజా
సననిష్ఠ న్నినుఁ జూడఁ గన్న నది వోసౌఖ్యంబు లక్ష్మీవిలా
సినిమాయానటనల్ సుఖంబు లగునే శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా ! నీ ఆలయ సమీపంలో... సువర్ణముఖినదీ తీరాన ... మామిడితోటలో అరుగుమీద ... పద్మాసనంలో కూర్చుని ... నిష్ఠగా నిన్ను ధ్యానిస్తూ ... ఆ ధ్యానంలో నిన్ను దర్శిస్తూ ... చిత్తంలో ఆ ఆనందాన్ని అనుభవించగలిగితే ... అదే నిజమైన ఆనందం ! అదే సత్యమైన సుఖం ! అంతే కాని, ధనం ద్వారా దొరికే ప్రాపంచిక సుఖాలూ ... వాటివల్ల కలిగే ఆనందం ... నిజమైన ఆనందం అవుతుందా ? కానే కాదు ! "

## " అంతర్నేత్రం ... బ్రహ్మానందం "

" తమనేత్రద్యుతిఁ దామె చూడ సుఖమై తాదాత్మ్యమున్ గుర్పఁ
గా విమలమ్ముల్ కమలాభముల్ జితలసద్విద్యుల్లతాలాస్యముల్
సుమనోబాణజయప్రదమ్ములనుచున్ జూచున్ జనంబూనిహా
రిమృగాక్షీనివహమ్ముకన్నుగవలన్ శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా! మనుష్యులు ఉత్తమమైన యోగసాధన చేసి తమ అంతర్నేత్రం లోని తేజోబిందువు ను తామే చూసి, తాదాత్మ్యం చెంది, బ్రహ్మానందం పొందగలరు. కానీ జనులు అది మాని స్త్రీల కన్నులకు కల సౌందర్యవిషయంలో మోహంతో 'ఆ కళ్ళు నిర్మలమైనవి' ... 'పద్మాలను పోలినవి' ... 'వాటి కదలికలు మెఱపుతీగల లాస్యం అనే సుకుమారనృత్యాన్ని పోలినవి'... 'వీటి సౌందర్యంతోనే మన్మథుఁడు లోకాలను జయించగలుగుతున్నాడు'... అని వర్ణిస్తుంటారు. వీళ్ళు ఎంతటి అవివేకులో కదా ! "

## " అపుత్రస్య ... "

" కొడుకుల్ పుట్టరటంచు నేడ్తు రవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్
వడసెం బుత్రులు లేని యా శుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్!
చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా ! అజ్ఞానులు ప్రాపంచిక భ్రాంతిచేత కొడుకులు పుట్టలేదే.. పుట్టరో ఏమో ! ... అనుకొని ఏడుస్తుంటారు. కానీ వందమంది కుమారులు కలిగిన కౌరవరాజు ధృతరాష్ట్రుడు సద్గతి పొందాడా? మరి సంతానమే లేని శుకుడికి దుర్గతి కలిగిందా? కాబట్టి, సంతానం లేనివారికి మోక్షం సిద్ధించకపోదు ! "

## " ఉపసంహారం "

" దంతంబు ల్పడనప్పుడే తనువునందారూఢి యున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే
వింతల్మేన జరించనప్పుడె కురుల్వెల్లెల్ల గానప్పుడే
చింతింపన్వలె నీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా ! "

" శ్రీకాళహస్తీశ్వరా ! ఏ మానవుడైనా కాని ... తమ శరీరంలో జవసత్వాలు ఉండగానే ... అంటే దంతాలు గట్టిగా ఉన్నప్పుడే... తన శరీరం బలంగా ఉన్న స్థితిలోనే ... స్త్రీలు తనను ఏవగించుకొనక ముందే ... శరీరము ముసలితనంతో శిథిలం కాక మునుపే ... తన వెంట్రుకలు నెరసి తెల్లతెల్లగా కాకముందే... శరీరంలో మెరుగులు తగ్గక ముందే ... అప్పుడే ... నీ పాదపద్మాలను సేవించి ... ధ్యానించి ... తన జీవితాన్ని ధన్యం చేసుకోవాలి ! ".



## ధ్యానం చేసే పద్ధతి = ఆనాపానసతి

### " శ్వాస మీద ధ్యాస "

ఎవరికి తగిన సుఖాసనంలో ... వారు ... హాయిగా ... కూర్చుని ... చేతులు రెండు కలిపి ... కళ్ళు రెండు మూసుకుని ... ప్రకృతి సహజంగా జరుగుతూన్న ఉచ్ఛ్వాస, నిశ్వాసలను ... ఏకధారగా ... గమనిస్తూ ఉండాలి ! ఏ దేవతా, గురు రూపాన్నీ ప్రత్యేకంగా ఊహించుకోరాదు ! ఏ దైవ నామస్మరణా ఉండరాదు ! మామూలుగా జరుగుతున్న ఉచ్ఛ్వాస నిశ్వాసలనే ఆహ్లాదంగా గమనిస్తూ ఉండాలి.

### " ధ్యానం నిర్విషయం మనః "

మధ్య మధ్యలో అనేకానేక ఆలోచనలు వస్తున్నా వాటిని ఎప్పటికప్పుడు కట్ చేస్తూ ... మళ్ళీ మళ్ళీ శ్వాస మీదకే ... ధ్యాస మరల్చుతూ ఉంటే ... క్రమక్రమంగా ... ఆలోచనా రహిత స్థితి కలుగుతుంది ... చిత్తవృత్తులు నిరోధింపబడతాయి ... మనస్సు నిర్విషయం, శూన్యం అయిపోతుంది ... ఇదే ధ్యానస్థితి.

### " ఆత్మానుభవాలు "

ఈ ఆలోచనారహితస్థితిలో కలిగే అనేకానేక శారీరక, నాడీమండల, ఆత్మానుభవాలను విజ్ఞానోత్సాహంతో గమనిస్తూ ఉండాలి. ఆ స్థితిలో శరీరం వెలుపల ఉన్న విశ్వమయ ప్రాణశక్తి ... cosmic energy ... అపారంగా శరీరంలోకి ప్రవేశించి నాడీమండలాన్ని శుద్ధి చేస్తుంది.

### " ప్రతి రోజూ ధ్యానాభ్యాసం "

ప్రతిరోజూ ఎవరి వయస్సు ఎంతుంటుందో ... కనీసం అన్ని నిమిషాలు ... తప్పనిసరిగా ... రోజుకి రెండుసార్లుగా ... ధ్యానం చేయాలి.

ధ్యానానికి... ఏ సమయమైనా మంచి సమయమే !
ధ్యానానికి... ఏ ప్రదేశమైనా మంచి ప్రదేశమే !

### ధ్యానం వలన లాభాలు

* శారీరక ఆరోగ్యం * ఏకాగ్రత * జ్ఞాపకశక్తి * మానసిక ప్రశాంతత
* ఆత్మవిశ్వాసం * పరస్పర అవగాహన